శ్రీరస్తు

23

# నారాయణవనమాల.

# శ్రీరామ నామావళి.

# శ్రీకృష్ణస్తుతి.

# హనుమద్గీతావళి.



1980

మదరాసు

శ్రీరస్తు.



# నారాయణవనమాల

క. నారాయణ వనమాలను
నారీ పురుషార్థ ఫలఘ నంబగు
భక్తిఁ పారాయణ మొనరించిన
నారాయణుఁడొ సగు నెపు డనం
తశుభంబుల్.

## లక్ష్మీస్తోత్రం.

లక్ష్మీంక్షీరసముద్రరాజతనయాం।
శ్రీరంగ ధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవవనితాం।
లోకైక దీపాంకురాం।

శ్రీమన్మంద కటాక్ష లబ్ధవిభవ ।
బ్రహ్మేంద్ర గంగాధరాం ।
త్వాం త్రైలోక్య కుటుంబినీం ।
సరసిజాం వందే ముకుంద ప్రియాం॥

శ్రీ లక్ష్మీసఖ హరినారాయణ
చిరశుభదాయక హరినారాయణ
ఫాలనయన హిత హరినారాయణ
ప్రహ్లాదార్చిత హరినారాయణ
శంఖచక్రధర హరినారాయణ
శార్ఙ్గగదాధర హరినారాయణ
సంకటహరణా హరినారాయణ
సరసిజచరణా హరినారాయణ
పండితరక్షక హరినారాయణ
పద్మజజనకా హరినారాయణ

దండధరార్చిత హరినారాయణ
శైవశిఖామణీ హరినారాయణ
కరుణాసాగర హరినారాయణ
కారణకర్తా హరినారాయణ
పురాణపురుషా హరినారాయణ
బుధజనతోషా హరినారాయణ
వాసవవంద్యా హరినారాయణ
వైకుంఠాలయ హరినారాయణ
సృష్టిస్థితిలయ హరినారాయణ
సుందరవిగ్రహా హరినారాయణ
జలదశ్యామా హరినారాయణ
సుగుణస్తోమా హరినారాయణ
మూలాధారా హరినారాయణ
మౌక్తికహారా హరినారాయణ
పతితసుపావన హరినారాయణ

పన్నగశయనా హరినారాయణ
నిత్యనిరంజన హరినారాయణ
నీరజనయనా హరినారాయణ
దశావతారా హరినారాయణ
దారిద్ర్యాంతక హరినారాయణ
శశినిభ వదనా హరినారాయణ
శాంతాభరణా హరినారాయణ
జలధివిహారా హరినారాయణ
ఝషావతారా హరినారాయణ
కలుషవిదూరా హరినారాయణ
కౌస్తుభకంధర హరినారాయణ
కుంజరరిపుహర హరినారాయణ
కూర్మాకారా హరినారాయణ
మంజులభాషా హరినారాయణ
మణిమయభూషా హరినారాయణ

మందరగిరిధర హరినారాయణ
మధుకైటభహర హరినారాయణ
బృందారకనుత హరినారాయణ
భూతలనాథా హరినారాయణ
వరాహరూపా హరినారాయణ
వనరుహనాభా హరినారాయణ
ధరారిమర్దన హరినారాయణ
దానవభంజన హరినారాయణ
నరహరివేషా హరినారాయణ
నతజనపోషా హరినారాయణ
పరమపవిత్రా హరినారాయణ
భవ్యచరిత్రా హరినారాయణ
జగదాధారా హరినారాయణ
శాంభవిసోదర హరినారాయణ
ఖగరాడ్వహనా హరినారాయణ

ఘనరిపుశోషణ హరినారాయణ
వామనదేవా హరినారాయణ
బలివైభవహర హరినారాయణ
కామితఫలదా హరినారాయణ
కరిరాడ్వరదా హరినారాయణ
భార్గవరామా హరినారాయణ
భక్తోద్ధామా హరినారాయణ
నిర్గుణరూపా హరినారాయణ
నిత్యప్రతాపా హరినారాయణ
దశరథరామా హరినారాయణ
తారకనామా హరినారాయణ
దశముఖవిదళన హరినారాయణ
తాటకసూదన హరినారాయణ
కృష్ణావతార హరినారాయణ
కువలయదళా హరినారాయణ

దుష్టవినాశన హరినారాయణ
శిష్టసుపాలన హరినారాయణ
సన్నుతవిజయా హరినారాయణ
సత్కృతవినయా హరినారాయణ
మదనవిలాసా హరినారాయణ
మాయాతీతా హరినారాయణ
జగదభిరామా హరినారాయణ
సంగరభీమా వారినారాయణ
నగసమధీరా హరినారాయణ
నవదధిచోరా హరినారాయణ
మురళీగాయక హరినారాయణ
మునిజనపోషక హరినారాయణ
ఆశ్రితరక్షణ హరినారాయణ
అంబుధిశయనా హరినారాయణ
పరమదయాకర హరినారాయణ

ప్రణవాకారా హరినారాయణ
మురనరకాంతక హరినారాయణ
మోక్షసుదీపక హరినారాయణ
భవహరశూరా హరినారాయణ
బలరామానుజ హరినారాయణ
రవిసమ తేజా హరినారాయణ
రమ్యమహాత్మా హరినారాయణ
భయదనివారా హరినారాయణ
బౌద్ధావతారా హరినారాయణ
స్వయంప్రకాశా హరినారాయణ
శౌనకసంస్తుత హరినారాయణ
కల్కిశరీరా హరినారాయణ
కనకమకుటధర హరినారాయణ
తులసీలోలా హరినారాయణ
తుంబురుపాలా హరినారాయణ

ధర రాజముపురి హరినారాయణ
ద్ధాసాభరణా హరినారాయణ
నరహరికవినుత హరినారాయణ
నారదవందిత హరినారాయణ
జయదామోదర హరినారాయణ
జయపరమేశ్వర హరినారాయణ
జయజయవిష్ణో హరినారాయణ
జయజయజిష్ణో హరినారాయణ

శ్రీహరినారాయణార్పణమస్తు
ముక్కంటి-నరసిహ్మదాసప్రణీతము

---

హరేరామ హరేరామ
రామరామహరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ
కృష్ణకృష్ణ హరేహరే ॥



శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః



# శ్రీరామ నామావళి

క. శ్రీరామ రామ యనుచును
ఏమానవుడాయె నేని
యేర్పడమదిలో
ఆ రామ విభునిదలచిన
కారాకులు డుల్లునట్లు
కర్మము డుల్లున్ ॥

బాలకాండ

శ్రీపతిసర్వ జగత్పతి రామ
శ్రీవైకుంఠనికేతన రామ
నిత్యముక్త జనసేవిత రామ
నిరుపమగుణమణి జలనిధి రామ
స్వాభావిక ధీముఖగుణ రామ
సర్వాధార నిరంజన రామ
సత్యజ్ఞాన సుఖాత్మక రామ
సమస్త చిదచిద్విగ్రహ రామ
చిదచిద్దోష నిరంజన రామ
చిత్రజగత్రయ నిర్మిత రామ
అతివాఙ్మానస వైభవ రామ
అబ్జసంభవాద్యంతర రామ
సర్వవేదగుణ సన్నుత రామ
సర్వవాచక ఖ్యాపిత రామ

క్షీరాంబోధి నికేతన రామ
స్వీకృత జీవ ప్రార్థన రామ
రఘుకుల వార్ధి సుధాకర రామ
రంజితలోక నిరంజన రామ
కౌసల్యాదశరథ సుత రామ
సకలజనానందన గుణ రామ
అనవరతానుజ సంయుత రామ
ఆదృతసర్వజనావన రామ
విశ్వామిత్ర ప్రార్థిత రామ
విరూపదానవీ సూదన రామ
మఖవిఘ్న కరాసురహర రామ
మారీచసుమార నివారక రామ
యజ్ఞాధిప యజ్ఞావన రామ
యజ్ఞరూప యజ్ఞప్రియ రామ
గౌతమపత్నీ పావన రామ

కరుణారస వరుణాలయ రామ
వీక్షితజనక మహాధ్వర రామ
విశ్వజనార్చిత విశ్రుత రామ
జనకమహీపతి సేవిత రామ
శతానంద సమర్చిత రామ
పురహరచాప విభంజక రామ
పురుహూతాదిసమర్చిత రామ
జనకసుతాప్రియతమగుణ రామ
జనతానంద విధాయక రామ
జననీజన కానుజయుత రామ
జగతీమంగళ వైవాహన రామ
సీతాపరిణయశోభిత రామ
శ్రీపరిపూర్ణ విభాసిత రామ
శ్రితకల్యాణానుజయుత రామ
జితభార్గవరామ మహాద్భుత రామ

ధీరవీర రణశోభిత రామ
దిగంతవిశ్రాంతయశోద్భృత రామ
శ్రీమదయోధ్యా పురగత రామ
శ్రీసీతా సంసేవిత రామ
శ్రీసీతా ప్రాణ ప్రియ రామ
అపరిమితా నందాన్విత రామ

## అయోధ్యకాండ

పితృవాక్యపరీ పాలక రామ
ప్రియహిత సీతా లక్ష్మణ రామ
నావికరాజ సుపూజిత రామ
వందితనానా వనచర రామ
చిత్రకూటగిరి మందిర రామ
శ్రీసీతాయుత బహుసుఖ రామ
శ్రీలక్ష్మణ సంసేవిత రామ
శ్రితమునిజన సతతాంచిత రామ

శరణాగతభరతార్థిత రామ

జనకాజ్ఞాస్థిరనిశ్చయ రామ

భరతప్రార్థిత పాదుక రామ

బహుమానితగురుజనహిత రామ

## అరణ్యకాండ

దండకాటవీ విహరణ రామ

దనుజవిరాధ విభంజక రామ

అద్భుతమునిజన యాచన రామ

అసురనివారణ దీక్షిత రామ

శరభంగ సుతీక్ష్ణాదృత రామ

శంసితకలశోద్భవముని రామ

పంచవటీకృతమందిర రామ

హాసరాక్షసీ పరిహార రామ

ఖరదూషణముఖ రిపుహర రామ

టహాకపరిణ సంహారక రామ

కాంతామార్గణ శోషిత రామ
జటాయు మోక్ష విధాయక రామ
చటులకబంధ నిషూదన రామ
శబరీసాదర పూజిత రామ

## కిష్కింధాకాండ

హనుమత్సేవిత పదయుగ రామ
హరిరాజ సమాశ్రితపద రామ
సుగ్రీవాభయదాయక రామ
సుఖతర వాలి నిషూదన రామ
వానరసేనా ప్రేరక రామ
వాయుసుతాదృతమతియుత రామ

## సుందరకాండ

హనుమత్ప్రేరిత ముద్రిక రామ
హనుమద్వాచిక నందిత రామ

# యుద్ధకాండ

సేవితసాగర సన్నుత రామ
సేతుబంధనా దృతమతి రామ
నిరుపమయుద్ధ నిదర్శక రామ
నిఖిలమహాసుర భంజక రామ
రావణకంటక నాశక రామ
రంజితసకలా వనిజన రామ
విధిముఖసురముని వందిత రామ
విశ్రుతసీతాసంయుత రామ
విభీషణశ్రీ ప్రాపక రామ
వివిధవానరో జ్జీవక రామ
భరద్వాజముని పూజిత రామ
భరతసమర్పిత పాదుక రామ
స్వీకృతరాజ మహాసన రామ
సిద్ధమునీశ్వర సేవిత రామ

సురముని గురుజన సేవక రామ
సుస్థిరకీర్తి సమన్విత రామ
వర్ణాశ్రమ పరిపాలక రామ
వసుధాధారక సద్గుణ రామ
యజ్ఞారాధిత దైవత రామ
యమిపర మానస సేవిత రామ
మాయామానుష విగ్రహ రామ
మానాతీత మహాగుణ రామ
జయవిజయీభవ జానకీ రామ
జయవిజయీభవ జయ శ్రీరామ

శ్రీరామార్పణమస్తు.

పర్ణశాల-నరసిహ్మాచార్యవిరచితం

---

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః



# శ్రీకృష్ణస్తుతి

శ్రీకర కరుణాసాగర
ప్రాకటలక్ష్మీకళత్ర భవ్యచరిత్రా
లోకాతీత గుణాశ్రయ
గోకులవిస్తార నందగోపకుమారా.

యదుకులభూషణ శ్రీకృష్ణా
సదయాలోకన. హరికృష్ణా
నందనందనా శ్రీకృష్ణా
సుందరవదనా హరికృష్ణా

నీల కాంతియుత శ్రీకృష్ణా
బాలగోపనుత హరికృష్ణా
సుందరగిరిధర శ్రీకృష్ణా
బృందావనచర హరికృష్ణా
పూతనాంత కా శ్రీకృష్ణా
పాతకఖండన హరికృష్ణా
శకటాసురహర శ్రీకృష్ణా
సకలవిశ్వధర హరికృష్ణా
పరిభావితవిధి శ్రీకృష్ణా
సురగణనుతధీ హరికృష్ణా
కాళియమర్ద వ శ్రీకృష్ణా
పాలితసజ్జన హరికృష్ణా
నిజమురళీప్రియ శ్రీకృష్ణా
వ్రజనారీప్రియ హరికృష్ణా
ఘోరకుంభిహర శ్రీకృష్ణా

| | |
|---|---|
| కుబ్జాత్రహార | హరికృష్ణా |
| వ్యోమాఖ్యాంతక | శ్రీకృష్ణా |
| కామిత దాయక | హరికృష్ణా |
| అక్రూరావన | శ్రీకృష్ణా |
| యమునా ఖేలన | హరికృష్ణా |
| కంసధ్వంసక | శ్రీకృష్ణా |
| శంసిత చరిత్రా | హరికృష్ణా |
| రాధానాయక | శ్రీకృష్ణా |
| సాధుహృదీశ్వర | హరికృష్ణా |
| ఖండనపండిత | శ్రీకృష్ణా |
| పాండవరక్షణ | హరికృష్ణా |
| నరకవిదారణ | శ్రీకృష్ణా |
| పరమగుణోన్నత | హరికృష్ణా |
| కుచేలపోషక | శ్రీకృష్ణా |
| సుచరితభాసిత | హరికృష్ణా |

దీనులమమ్మను శ్రీకృష్ణా
మానక బ్రోవవె హరికృష్ణా
నిగమగోచరా శ్రీకృష్ణా
సుగతివిధావే హరికృష్ణా
తప్పులెంచకుము శ్రీకృష్ణా
తప్పక కావుము హరికృష్ణా
పాపులమయ్యా శ్రీకృష్ణా
పదములఁజూపుము హరికృష్ణా
పరమకరుణఁగను శ్రీకృష్ణా
వరములనిడవే హరికృష్ణా
రక్షించియుమము శ్రీకృష్ణా
మోక్షమొసంగవె హరికృష్ణా
కృష్ణశర్మనుత శ్రీకృష్ణా
తృష్ణలఁదీర్పవె హరికృష్ణా

శ్రీకృష్ణార్పణమస్తు.

కృష్ణేతి మంగళన్నామ
యస్యవాచిప్రవర్తతే।
భస్మీభవంతి రాజేంద్ర
మహాపాతక కోటయః॥
గ్రాహగ్రస్తే కరీంద్రే
ముకుళిత నయనే
మూలమూలేతి ఖిన్నే
నాహంనాహంనచాహం
నచభవతి పునస్తా
దృశోమాదృశేషు
ఇత్యేవంత్యక్తహస్తేసపదిసురగణే
భావశూన్యే సమస్తే
మూలంయత్ప్రాదురాసీ
త్సదిశతు భగవాన్
సంతతంమంగళన్నః॥



# హనుమద్గీతావళి

శ్లో॥ కేయూరాన విభూషయన్తి
పురుషం హారాన చంద్రోజ్జ్వలా।
వస్నానంనవిలేపనం నకుసుమంనా
లఙ్కృతా మూర్ధజాః।
వాణ్యేకా సమలఙ్కరోతి పురుషం
యాసంస్కృతా ధార్యతే।
క్షీయన్తేఖిలు భూషణాని సతతమ్
వాగ్భూషణం భూషణమ్॥

ఆంజనేయ మతిపాటలాననమ్
కాంచనాద్రి కమనీయ విగ్రహమ్।
పారిజాత తరుమూల వాసినమ్
భావయామి పవమాననన్దనమ్॥
యత్రయత్ర రఘునాథకీర్తనమ్
తత్రతత్ర కృతమస్తకాంజలిమ్।
భాష్పవారి పరిపూర్ణ లోచనమ్
మారుతిం నమత రాక్షసాన్తకమ్॥

సుర ముని వరనుత హనుమంతా
పరమ కృపాన్విత హనుమంతా
ఏకపదాభవ హనుమంతా
ప్రాకట గుణ గణ హనుమంతా
కేసరి తనయా హనుమంతా
వాసవ వందిత హనుమంతా
కుంజర సుత భవ హనుమంతా

అంజనీతనయ హనుమంతా
శివ తేజోంచిత హనుమంతా
పవమానాత్మజ హనుమంతా
అరుణారుణ ముఖ హనుమంతా
వర మణి కుండల హనుమంతా
పింగ నయనా హనుమంతా
సుశరీర ప్రభ హనుమంతా
అజాను భుజా హనుమంతా
భూజన సంస్తుత హనుమంతా
కంకణ మండిత హనుమంతా
పంకజ చరణా హనుమంతా
ఘనవాలాన్విత హనుమంతా
ఇనకబళన రత హనుమంతా
భర్మాంబరధర హనుమంతా
విమలతరయుశ హనుమంతా

విశ్వరూపధర హనుమంతా
శాశ్వతమహిమా హనుమంతా
సూర సుశిష్యా హనుమంతా
కారణ జన్మా హనుమంతా
పటు వటు నియమా హనుమంతా
కుటిల విదారణ హనుమంతా
గాంభీర్యగుణా హనుమంతా
శుంభ ద్విక్రమ హనుమంతా
భానుజ సచివా హనుమంతా
ధీనయ శోభిత హనుమంతా
హిత సమ్మేళన హనుమంతా
చతుర మతి యుతా హనుమంతా
దాశరథి భటా హనుమంతా
సౌశీల్యాత్మా హనుమంతా
స్వీకృత ముద్రిక హనుమంతా

సహాయ లక్ష్మణ హనుమంతా
సీతాన్వేషణ హనుమంతా
ధూతకళంకా హనుమంతా
శంకిత స్వబలా హనుమంతా
సంకట హరణా హనుమంతా
ప్రోత్సాహితబల హనుమంతా
కుత్సితదూరా హనుమంతా
అర్ణవ లంఘన హనుమంతా
దుర్ణయ దూషణ హనుమంతా
మైనాక ప్రియ హనుమంతా
మానిత సత్కృత హనుమంతా
ఛాయాగ్రహహర హనుమంతా
మాయాధ్వంసక హనుమంతా
సురసా సన్నుత హనుమంతా
పర పుర దర్శన హనుమంతా

లంకా ప్రవేశ హనుమంతా
లంకిణీహారా హనుమంతా
అంతః పుర చర హనుమంతా
కాంతా న్వేషణ హనుమంతా
సితో ధ్యానా హనుమంతా
సీతా లోకన హనుమంతా
వినయ విభూషణ హనుమంతా
వనితా భాషణ హనుమంతా
దత్తాంగుళికా హనుమంతా
చిత్తముత్ప్రిదా హనుమంతా
సతి శంకాంతక హనుమంతా
అతులిత ధైర్యా హనుమంతా
వనభంగోద్యమ హనుమంతా
వనపాల హరా హనుమంతా
అమిత్ర మర్దన హనుమంతా

అమాత్యసుతహర హనుమంతా
రాక్షసబల హర హనుమంతా
అక్ష విహింసక హనుమంతా
అజాస్త్ర బంధిత హనుమంతా
గజాయుతబలా హనుమంతా
ధనుజసభా స్థిత హనుమంతా
ఘనమాత్సేక్షణ హనుమంతా
అహిత విలోకన హనుమంతా
బహుళపితాత్మా హనుమంతా
దశముఖ వీక్షణా హనుమంతా
అశని శరీరా హనుమంతా
కఠిన భాషణా హనుమంతా
శత మద వారణ హనుమంతా
ఉగ్ర మహార్థియుత హనుమంతా
వ్యగ్ర నిగ్రహా హనుమంతా

ఉమితాసురవర హనుమంతా
శమదమభూషణ హనుమంతా
లంకాదాహక హనుమంతా
సంకీర్తితబల హనుమంతా
హాత దానవకుల హనుమంతా
గత సీతాంతిక హనుమంతా
అర్పిత వందన హనుమంతా
దర్పితారి హర హనుమంతా
తోషిత హృదయా హనుమంతా
పోషిత కపికుల హనుమంతా
మధు వన సాధనా హనుమంతా
పథిక శ్రమ హర హనుమంతా
రామా లోకన హనుమంతా
స్వామిప్రియకర హనుమంతా
వర మణి దాతా హనుమంతా

పరితోషిత విభు హనుమంతా
దేవ దేవ శ్రీ హనుమంతా
పావన చరితా హనుమంతా
హతదుష్ట గ్రహా హనుమంతా
జిత పైశాచక హనుమంతా
ప్రణవ రూప శ్రీ హనుమంతా
ప్రణతావన చణ హనుమంతా
అమరార్చిత పద హనుమంతా
త్రిమూర్తి మయ శ్రీ హనుమంతా
తృష్ణా వారణ హనుమంతా
కృష్ణ శర్మ నుత హనుమంతా

హనుమద్గీతావళి సమాప్తమ్

వేదము-వేంకటకృష్ణశర్మ ప్రణీతము.

---

*Prasad Printers, Madras-1.*

ఈ పుస్తకము శ్రీ మొగిలి అక్కులయ్య శెట్టిగారి జ్ఞాపకార్థం మొగిలి అక్కు పంకజమ్మ గారిచే ముద్రింపబడినది.

దొరకు స్థలము:

25, ఆరుముగం వీధి,

మద్రాసు-600 001.